# మహా శివరాత్రి పూజా విధానం

(శివరాత్రి వ్రత విధి, యామ పూజ, అర్ఘ్య ప్రదానం, శివ పంచాక్షరీ మంత్ర జప విధి, వివిధ స్తోత్రాలు)




రచన మరియు సంకలనం :

మద్దికుంట శ్రీకాంత్ శర్మ

హిందూ ధర్మచక్రం (హైదరాబాద్)

శ్రీ మహా గణాధిపతయే నమః
శ్రీ గురుభ్యోనమః

# మహా శివరాత్రి పూజా విధానం

కాపీ రిజిష్టర్డ్

ప్రథమ ముద్రణ : 2000 కాపీలు

శ్రీ వికారినామ సంవత్సర మాఘ బహుళ చతుర్దశి
శుక్రవారం తేది 21-02-2020

వెల రూ ॥ 165-00

Printed at:
**Shivani Web Offset Printers,**
Mallapur, Hyderabad.

ప్రకాశకులు:
హిందూ ధర్మచక్రం ధార్మిక ప్రచారం హైదరాబాద్.
3-15-86, మల్లాపూర్, నాచారం, హైదరాబాద్ - 500 076.
సెల్: 9849485645
E-mail: hindudharmachakram@gmail.com
mksharma108@gmail.com

ప్రతులకు సంప్రదించగలరు సెల్ 9849485645



# అంకితం





॥ అస్మత్ పిత్రుభ్యో నమ: ॥

నా ఈజీవానికి, జీవనానికి, జీవితానికి కారణం అయిన మా నాన్నగారు స్వర్గీయులు బ్రహ్మ శ్రీ. మద్దికుంట వేంకటేశ్వర శర్మ గారికి... మనసా వాచా కర్మణా సాష్టాంగ ప్రణామాలు సమర్పిస్తూ... తాను ఆర్థికంగా ఎన్నో కష్టాలను ఎదుర్కొంటున్నప్పటికీ, మాకు ఏ లోటూ తెలియకుండా పెంచి, విద్యా బుద్ధులు నేర్పించి, నేను స్థిరపడేలోపే మమ్మల్ని వదిలి వెళ్లిపోయినా, అనునిత్యం స్మరిస్తూ ఈ గ్రంథాన్ని వారికి అంకితం చేస్తున్నాను.





# కృతజ్ఞతా సమర్పణం



కర్తా కారయితా చైవ ప్రేరకశ్చ అనుమోదక:।

సుకృతే దుష్కృతే చైవ చత్వార: సమభాగిన:॥

అని ధర్మశాస్త్ర వచనం. అనగా... ! ఏపనికైనా... చేసేవాడు, చేయించేవాడు, ప్రేరేపించేవాడు, ఆమోదించువాడు అని నలుగురుంటారు. ఆ కార్యంలోని పుణ్యఫలం పొందడంలో ఈ నలుగురూ కూడా సమానమైన ఫలితాన్ని పొందుతారట. మహా శివరాత్రి పూజా విధానం ఈ శివరాత్రి (శ్రీ వికారి నామ సం॥, 2020, ఫిబ్రవరి 21) లోపు జనబాహుళ్యంలోకి వచ్చి శివ భక్తులకు ఉపయోగం అవ్వడానికి నేను రాయడం అయితే రాసాను కానీ, ముద్రణా భారం అనేది ఎలా ? అని ఆలోచిస్తూ, మా హిందూ ధర్మచక్రం వాట్సాప్ సమూహంలో ఇదే విషయాన్ని చెప్పడం జరిగింది. వెనువెంటనే మా సమూహం సభ్యులు స్పందించి, నన్ను 'ప్రేరేపించి', ముద్రణ వ్యయ భారాన్ని 'ఆమోదించి' నన్ను ప్రోత్సహించి ముద్రణ 'చేయించినారు'.

కావున ఇందుమూలంగా ఈ గ్రంథ రచనకు ఆర్థిక సహకారం అందించిన

1. కీ.శే. శ్రీ కూపరి రాంమోహన్ గారి జ్ఞాపకార్థం
   వారి సతీమణి శ్రీమతి. కూపరి సరస్వతి బాయి గారు (మల్కాజ్‌గిరి, హైదరాబాద్)
2. శ్రీమతి & శ్రీ గోవిందరాజు వేదవతీ రాజశేఖర్ శర్మ గారు (బెంగుళూరు)
3. శ్రీమతి & శ్రీ దండమూడి శారద శ్రీధర్ గారు (విజయవాడ)
4. శ్రీమతి & శ్రీ మాధవి ప్రభాకర్ రావు గారు (బెంగుళూరు)
5. శ్రీమతి & శ్రీ పూసల జ్యోతి సునిల్ కుమార్ గారు (ఐర్లాండ్)
6. శ్రీమతి & శ్రీ యజ్ఞమూర్తి విద్యావతి సత్యనారాయణ రావు గారు
   (చిక్కడపల్లి, హైదరాబాద్)
7. ముఖచిత్రమును అందంగా తయారుచేసి ఇచ్చిన ZYRISH GRAPHICS
   శ్రీమతి & శ్రీ హనుమేష్ గారు (బళ్ళారి, కర్నాటక)

వీరికీ వీరి కుటుంబసభ్యలకు ఆ ఆషుతోషుని అనుగ్రహ విభూతి సర్వకాలములందు వర్షిల్లాలని ప్రార్థిస్తూ, ముకుళిత హస్తాలతో ధన్యవాదాలు తెలియజేసుకుంటూన్నాను.

మీ హిందూ ధర్మచక్రం శర్మ

# ముందుమాట





దర్శనమ్
ఆధ్యాత్మిక వార్తామాసపత్రిక

DARSHANAM SRIRAMA SIDDHANTHI BHAVANAM H NO 29-105/4/1 NEW VIDYA NAGAR, NEREDMET, SECUNDERABAD 500056

## ఆస్తికులందరికీ కరదీపిక "మహా శివరాత్రి పూజావిధానం" పుస్తకం

పంచాక్షరీలోని శివ అనే రెండక్షరాలు పరమ పావన మైనవి . శివ అంటే మంగళమని అర్థం. పరమ మంగళకరమైనది శివస్వరూపం.ఆ పరమశివుని అనుగ్రహం పొందటానికి మనం జరుపుకునే ముఖ్యమైన ధార్మికోత్సవం మహాశివరాత్రి. పురాణాలలో చెప్పినటువంటి ఈ మహాశివరాత్రిని ప్రతి సంవత్సరం మాఘమాసం కృష్ణపక్షంలో చతుర్థశినాడు జరుపుకుంటాం.శివరాత్రి వైదిక కాలం నాటిది. ఏడాదిలో వచ్చే శివరాత్రులు మొత్తం అయిదు. అవి : నిత్య శివరాత్రి, పక్షశివరాత్రి, మాసశివరాత్రి, మహాశివరాత్రి, యోగశివరాత్రి.వీటిలో పరమేశ్వరుడి పర్వదినం మహాశివరాత్రి. మార్గశిరమాసంలో బహుళ చతుర్థి,అర్ద్ర నక్షత్రం రోజున శివుడు లింగోద్భవం జరిగింది. శివునికి ప్రీతికరమైన తిథిఅది.అందుకే ఈరోజున శివుడ్ని లింగాత్మకంగా ఆరాధించిన వారెవరైనా పురుషోత్తములు అవుతారని పురాణాల మాట.ఈ రోజున శివ ప్రతిష్ఠ చేసినా లేక శివకళ్యాణం చేసినా ఎంతోశ్రేష్ఠం.మహాశివరాత్రి రోజు తనను పూజిస్తే తనకుమారుడైన కుమారస్వామి కన్నా ఇష్టులవుతారని శివుడు చెప్పడాన్ని బట్టి ఈవిశిష్టత ఏంటోఅర్థం చేసుకోవచ్చు.అష్టమిసోమవారంతో వచ్చే కృష్ణచతుర్థశి నాటి మహాశివరాత్రి ఎంతో శ్రేష్ఠమైందంటారు. అందుకేనేమో గరుడ,స్కంద,పద్మ అగ్ని మొదలైన పురాణాల్లో దీనిని ప్రశంసించడం జరిగింది.ఏ వ్యక్తి అయితే ఆరోజు ఉపవాసంచేసి,బిల్వపత్రాలతో శివపూజ చేస్తారో,రాత్రి జాగరణ చేస్తారో వారికి శివుడు ముక్తిని ప్రసాదిస్తాడు. ఆనందాన్ని, మోక్షాన్ని ప్రసాదిస్తాడు. వ్రతం చేసే వ్యక్తి శివమయంలో లీనమైపోతాడు. దానము, తపము, యజ్ఞము, తీర్థయాత్రలు, వ్రతాలు లాంటివెన్ని కలిపినా మహాశివరాత్రికి సరితూగలేవు. మహాశివరాత్రి రోజు ఉపవాసము,జాగరణశివపూజ ప్రధానమైంది. అసలు వీటికి తాత్విక అర్థాలెన్నో ఉన్నాయి. అసలు వ్రతం గురించి భిన్న భిన్న గ్రంథాల్లో భిన్నార్థలు గోచరిస్తున్నాయి. సులభంగా చెప్పుకోవాలంటే కర్మ ద్వారా ఇష్టదేవుడి సామీప్యాన్ని పొందటమే వాటి సారం.మహాశివరాత్రి వ్రతం రోజు ఉపవాసానికి చాలా ప్రాముఖ్యత ఉంది.

మనకు ముక్తిని ప్రసాదించే ఉత్కృష్ట పర్వదినమయిన మహాశివరాత్రి రోజున శివుడిని ఎలా ఆరాధించాలి, ఏయే పూజలు చేయాలి,పూజా విధానం ఏమిటి ,ఎలాంటి వ్రాత-నియమాలు ఆచరించాలి.. ఇత్యాది విషయాలను సవివరంగా తెలియజేస్తూ ఈ పుస్తకంలో సమగ్ర పూజా విధానాన్ని అందించిన మా ఆత్మీయుడు మద్దికుంట శ్రీకాంతశర్మ కృషి అభినందనీయం.. ఈ **"మహా శివరాత్రి పూజావిధానం"** పుస్తకం పురోహితులు, వేద,స్మార్త పండితులు, అర్చకులు, ఆస్తికులందరికీ ఒక చక్కని కరదీపిక కాగలదనటంలో ఎలాంటి సందేహం లేదు. ధర్మ సింధు, శివ మహాపురాణం, విద్యేశ్వర సంహిత తదితర గ్రంథాల నుంచి విషయం సేకరణతో రూపొందించిన ఈపుస్తకం అమూల్యమైంది.చిరకాలం నిలిచిపోయే ఈపుస్తకం రూపొందించి శ్రీకాంతశర్మ ధన్యుడయ్యాడు. మనలను ధన్యులను చేస్తున్నాడు. మరోమారు మద్దికుంట శ్రీకాంతశర్మ కృషికి ప్రశంసిస్తూ పండిత,పామరునలందరికీఉపయుక్తమయ్యే ఈ **"మహా శివరాత్రి పూజావిధానం"** అందరికీ చేరాలని ఆకాంక్షిస్తున్నా...సర్వం పరమేశ్వరార్పణమస్తు..!

మరుమాముల వెంకట రమణ శర్మ
సంపాదకులు **దర్శనమ్** మాసపత్రిక
నేరేడ్‌మెట్, సికింద్రాబాద్.

తేది 11-02-2020

PHONE 040-27220401, MOBILE - 9441015469 email: editordarshanam@gmail.com d_darshanam@yahoo.co.in

# రచయిత అభిప్రాయం



విద్యా సుశృతిరుత్కృష్టా, తత్ర రుద్రైకాదశినీ స్మృతా।
తత్ర పంచాక్షరీ తస్య శివ ఇత్యక్షర ద్వయం ॥

విద్యలన్నింటిలో వేదము గొప్పదిగా చెపుతారు, అందులోనూ, సంహితాకాండలోని రుద్రము (వీటినే నమక చమకాలని అంటారు), అందులో ఓం నమశ్శివాయ అనే పంచాక్షరి మంత్రం గొప్పది. అందులోనూ శివ అనే రెండక్షరాలు చాలా గొప్పవి అని శాస్త్రవచనం.

దేవోత్తముడైన శివుని స్మరణ చేసినవారు తమ జీవితంలో భోగభాగ్యములు పొందుతారు, మరణానంతరం శివలోకములో సాలోక్యము గాని (శివలోకములో ఉండుట), లేదా సామీప్యము గాని (శివుని దగ్గరగా ఉండుట), లేదా సారూప్యమును (శివ రూపాన్నీ పొందటం) కానీ, ఆపైన శివ సాయుజ్యం పొందుతారు అని శివ పురాణము ఉదహరిస్తుంది.

'అభిషేక ప్రియశ్శివ:, అలంకార ప్రియో విష్ణు:' అని ఆగమాదులు చెపుతున్నాయి. అలంకారము విష్ణువుకి, అభిషేకం శివునికి ప్రీతి.

శివుని శిరమున కాసిన్ని నీళ్ళు జల్లి
పత్తిరిసుమంతనెవ్వాడు పారవైచు
కామధేనువు వానింటి గాడిపశువు
అల్ల సురశాఖ వానింటి మల్లెచెట్టు

శివునికి అభిషేకం చేసి, పత్రితో పూజించిన వాడికి కోరికలు తీర్చే కామధేనువు ఇంటి పశువౌతుందట. ఏదైనా ఇవ్వగలిగే కల్పవృక్షం పెరటి చెట్టౌతుందట (అంతగా వరములిస్తాడని తాత్పర్యం) అందుకే "ఐశ్వర్యం ఈశ్వరాదిచ్ఛేత్" అంటారు.

శివరాత్రి అనగానే ఆసేతు హిమాచలం అంతా అభిషేకాలతో శైవ ఆలయాలు కిక్కిరిసిపోతాయి. ఈ తరుణంలో శివ భక్తులకు అనేకులకు తెలియని "శివరాత్రి పూజా విధానము" తెలియజేయాలని సంకల్పించి, ధర్మ సింధువు, శివ పురాణం లోని విద్వేశ్వర సంహిత వంటి గ్రంధాల నుండి విషయ సేకరణ చేసి, రుద్ర సూక్త విధానంగా రాయడానికి ఈశ్వరాజ్ఞగా భావించాను. పండిత - పామరులకు ఉభయులకూ ఈ గ్రంథం ఉపయుక్తం అవుతుంది అని విశ్వసిస్తున్నాను. కేవలం 20 రోజులలోనే ఈ సంకల్పం కలగడం, దానికి సహృదయులు ఆర్థికంగా ఆదుకోవడం అన్నీ చక చకా జరిగిపోయాయి. శివుడాజ్ఞ లేనిదే చీమైనా కదలదు అంటారు కదా ? నా ఈ రచనకి ఈశ్వర సంకల్పమే ఈ గ్రంథం సిద్ధం కావడానికి కారణం అని నమ్ముతున్నాను. అడిగిన వెంటనే ఎంతో పని ఒత్తిడిలో ఉన్నప్పటికీ ముందు మాట రాసిచ్చిన దర్శనం సంపాదకులు బ్రహ్మశ్రీ దర్శనం శర్మ గారికి అనేక ధన్యావాదములు. అలాగే ఈ ప్రయత్నంలో టైపింగ్‌లో మరియు ప్రూఫ్ చూడడంలో ఎంతో ఓర్పుతో నాకు సహకరించిన నా శ్రీమతి కుం.సౌ. శ్రీవాణికి ఆశీస్సులు తెలియజేస్తూ....

శ్రీకాంత్ శర్మ, హిందూ ధర్మచక్రం

# విషయ సూచిక



# మహాశివరాత్రి ఉపోద్ఘాతం



మాఘమాసం దేవయాణానికి అంకురార్పణ చేసింది, ఉత్తరాయణాన్ని దేవయాణం అని, దక్షిణాయనాన్ని పితృ దేవయాణం అని మన సంప్రదాయం చెబుతుంది. మాఘ మాసంలో పవిత్ర పర్వదినాలు వస్తాయి. వాటిలో మహాశివరాత్రి ఈ నెలలోనే వస్తుంది. ప్రతీనెల బహుళపక్షంలో 14వ రోజున మాసశివరాత్రి కాగా, మాఘ బహుళ చతుర్దశి మహాశివరాత్రి అవుతుంది. పద్మ పురాణం, స్కాంద పురాణం, లింగ పురాణం, గరుడ పురాణం, శివ సంబంధమైన ఈ మహాశివరాత్రి గురించి విశేషంగా వర్ణించాయి.

ఈరోజు శివారాధనం, శివసాన్నిధ్యంలో జాగారం జన్మ విహితాలయ్యాయి. ఈరోజున ఈశ్వరుణ్ణి అభిషేకాలతో, బిల్వపత్రాలతో, తుమ్మి పూలతో భక్తి శ్రద్ధలతో విశేషంగా అర్చిస్తారు. ఖగోళ పంచాంగ విజ్ఞానం ప్రకారం నిర్దేశితమైన శివ వైభవాన్నిలా స్మరిద్దాం!

ధ్యాయేన్నిత్యం మహేశం రజితగిరినిభం చారు చంద్రావతంసం ।
రత్నకల్పోజ్జ్వలాంగం పరశు మృగ వరాభీతి హస్తం ప్రసన్నం॥
పద్మాసనం సమం తత శ్రుత మమర గుర్వ్యాఘ్ర కృత్తివాసం।
విశ్వాద్యం విశ్వబీజం నిఖిల భయహరం పంచవక్త్రం త్రినేత్రం॥

పన్నెండు మాస శివరాత్రులలోకి ప్రధానమైన పర్వదినం మాఘ బహుళ చతుర్దశి (అమావాస్యకు ముందు వచ్చేది). నేడు ఈశ్వరుడు సాకారము, నిరాకారము అయిన లింగాకారంలో స్వయం ప్రకటితమైన రోజు కాబట్టి, దీనికి 'మహాశివరాత్రి' అని పేరు.

శివరాత్రి పర్వకాల నిర్ణయ విషయంలో ఒక ముఖ్యమైన నియమాన్ని శాస్త్ర గ్రంథాలు తెలిపి ఉన్నాయి. అదేమిటంటే ఆరోజు బహుళ చతర్దుశి తిథి అర్ధరాత్రి వరకు ఉండాలి. అర్ధరాత్రి కనుక బహుళ చతుర్దశి  లేని పక్షంలో అమావాస్య గనుక ప్రవేశించినట్లయితే అంతకు ముందు రోజునే శివరాత్రి పండుగ జరపాలి. రెండు రోజుల్లో ఏ రోజు చతుర్దశివుందో ఆ దినమే మహాశివరాత్రిగా పరిగణించాలి. దీనికి తోడు ఈ మహాశివరాత్రి గనుక మంగళవారం వస్తే అది అత్యంత ప్రశస్తం అని ధర్మ గ్రంధాలు చెబుతున్నాయి.

## శివరాత్రి నాడు ఆచరించవలసిన విధులు :

స్నాన, సంధ్యాదికములు పూర్తిచేసుకుని, నిత్యపూజ అయిన తరువాత

శ్లో॥ శివరాత్రి వ్రతంహ్యేతత్ కరిష్యేహం మహాఫలం ।

నిర్విఘ్నం కురుమే దేవా త్వత్ ప్రసాదాత్ జగత్పతే ॥

అని మహాదేవుడయిన శివుని మనసా ఆత్మతో ధ్యానించి సంకల్పం చేసి, చతుర్దశి తిథి అంతా నిరాహారుడై ఉపవాసం చేయాలి. ఉపదేశం ఉన్నవారు శివపంచాక్షరీ మంత్రమును అంగన్యాస, కరన్యాసములతో అనుసరించి సహస్రానికి (వెయ్యి) తక్కువ లేకుండా జపించాలి. వెయ్యికి పైన ఎంతైనా శివపంచాక్షరీ మంత్రము జపించవచ్చును.

(శివ పంచాక్షరీ మంత్ర జప విధానం పేజి. నం. 34 లో చూడగలరు.)

"ఓం నమశ్శివాయ" అనే మంత్రమునే శివపంచాక్షరీ మంత్రమంటారు. ఈ మంత్రం యథాశక్తి జపించిన తర్వాత మారేడుదళం గ్రహించి, పాలతో కలిపిన తీర్థంలో శివలింగం పై తర్పణంగా విడిచిపెట్టాలి. ఇలాగ దినమంతా శివపూజతోనూ, ధ్యానంతోను, రుద్రాభిషేకంతోను గడపాలి. ఈ రుద్రాభిషేకమును శక్తి కలిగినవారు మహన్యాస పూర్వకముగా గాని, లేక లఘున్యాస పూర్వకముగా కాని చేయవచ్చు.

శివలింగము స్ఫటికంతో చేసినది గాని లేక నర్మదానదిలో దొరికిన బాణంతో చేసిన బాణలింగం గాని లేదా మట్టితో చేసిన పార్థివ లింగము కాని ఏర్పాటు చేసి దాని పై మహాదేవుడయిన శివుని ధ్యాన, ఆవాహనాది షోడశోపచారములు చేసి రుద్రముతో అభిషేకము చేయాలి. నేటి కాలంలో అనేకులు లీటర్ల కొద్ది పాలు, ఇతర ద్రవ్యాలతో అభిషేకం ఆడంబరంగా చేస్తున్నారు. నిజానికి పంచామృత మంత్రాల సమయంలో మాత్రమే కొద్ది పరిమాణంలతో ఆయా ద్రవ్యాలు వాడాలి, మిగతా అభిషేకం అంతా చల్లని సుగంధభరిత జలంతో మాత్రమే చేయాలి. ఇదియే శాస్త్ర విహితము. అంతేకాక పంచామృతాలలో అనేకులు ఏ పాలు పడితే ఆ పాలు, ఏ పెరుగు పడితే ఆ పెరుగు వాడుతున్నారు. కేవలం ఆవుపాలు ఆవుపాలతో తోడేసిన పెరుగును మాత్రమే వాడాలి. అలా ఆచరించిన అభిషేకమే సత్ఫలితాన్ని ఇస్తుంది. గంగాజలంతో కాని, కేవలం అభిమంత్రించిన నీళ్ళతో గాని, రుద్రాభిషేకము చేయవచ్చును.

## రుద్రాభిషేక విధానం:

ఈ రుద్రాభిషేకం చేసేటప్పుడు లింగముపైన మారేడు దళములుంచి ఒక్కొక్క కలశంలోని నీళ్ళతో కలశపూజ చేసి, ప్రతి కలశమునందు శివపంచాక్షరితో మరియు మృత్యుంజయ మంత్రముతో అభిమంత్రించి, సిద్ధం చేసుకొని అప్పుడు రుద్రాభిషేకము ప్రారంభించాలి. అభిషేకం పూర్తయ్యేసరికి కలశములలో అభిమంత్రించిన జలము సరిగ్గా సరిపోవునట్లు చేసుకోవాలి. అలా చేస్తేనే రుద్రాభిషేక ఫలితము పూర్తిగా కలుగుతుంది.

చాలామంది బిందెలో నీళ్ళు నింపుకొని అవే నీటితో అభిషేకం చేస్తారు. దీనివల్ల ప్రయోజనము శూన్యము. ఈ విషయము చాల మంది పురోహితులకు కూడా తెలియదు. కాబట్టి అభిషేక జలానికి "గరుడ ముద్రను" చేతితో నీటిపై చూపించి మృత్యుంజయ మంత్రముతో అభిమంత్రించి ఆ జలాన్ని అమ్రుతీకరణము చేయాల్సివుంటుంది. ఇదియే శాస్త్ర విహితమైనది. ఆవిధంగా రుద్రాభిషేకం చేయువారి హస్తం అమ్రుతీకరణం అవుతుంది. అతడు ముట్టుకున్నచో అమృతతత్వం కలుగుతుంది. దీనికి రుద్రాభిషేక మంత్రములోనే "శివా విశ్వాయ భేషజీ". (విశ్వములోని అన్ని రోగములకూ శివుడే వైద్యము) కావున అమ్రుతీకరణము చేయని జలముతో శివాభిషేకము ఫలితమివ్వదు. ఈ రహస్యము తెలిసి శివ పూజలు చేసిన అపమృత్యు బాధలను జయించవచ్చు. మఖ్యముగా నేటికాలంలోని వైద్యులు అందరూ ఈ విధమైన అభిషేకం చేయడం ద్వారా వారి హస్తము అమృతత్వం పొందుతుంది. వారిచ్చే ఔషధము కూడా దివ్యముగా పనిచేసి రోగులు శీఘ్రంగా ఆరోగ్యవంతులు అవుతారు. దీన్నే "హస్త వాసి" అని మన పెద్దలు అంటారు. ఈ క్రతువు నిష్ణాతులైన వారిచే జరిపించడము శ్రేయస్కరము.

## శివరాత్రి వ్రతం:

త్రయోదశియందు ఏకభుక్తము చేసి, చతుర్దశియందు నిత్యకర్మను ఆచరించి, ప్రాత: కాలమున మంత్ర పూర్వకముగా సంకల్పించాలి.

శ్లో॥ "శివరాత్రి వ్రతంహ్యేతత్ కరిష్యేహం మహాఫలం।
నిర్విఘ్నం కురుమే దేవా త్వత్ ప్రసాదాత్ జగత్పతే॥
చతుర్దష్యాం నిరాహారో భూత్వా శంభో పరేహని।
భోక్ష్యేహం భుక్తి ముక్త్యర్థం శరణం మే భవేశ్వర॥

మహాఫలమునిచ్చు నీ శివరాత్రి వ్రతము చేసెదను. నీ ప్రసాదము వలన పరదినమందు పారణ, భుక్తి ముక్తులు కలుగజేయుము, నాకు రక్షకుడవుకమ్ము అని అర్థము.

'శివ ప్రీత్యర్థం శివరాత్రౌ శివ పూజాం కరిష్యే' అని సంకల్పించి పూజింపవలెను.

శ్రద్ధాసక్తులు ఉన్నవారు శివరాత్రి వ్రతాన్ని నాలుగు యామములందు (ప్రాత:కాలము, అపరాహ్ణ కాలము, ప్రదోషకాలము, రాత్రి కాలంలో) రుద్రాభిషకమును ఆచరించవలెనని ధర్మసింధువునందు చెప్పబడియున్నది.

రుద్రుడిని ధ్యానించి, ప్రాణప్రతిష్ఠ చేసి, లింగము స్థాపించి స్పృశింపుచూ.....

ఓం భూ: పురుషం సాంబ సదాశివం ఆవాహయామి

ఓం భువ: పురుషం సాంబ సదాశివం ఆవాహయామి

ఓం సువ: పురుషం సాంబ సదాశివం ఆవాహయామి

ఓం భూర్భువస్సువ: పురుషం సాంబ సదాశివం ఆవాహయామి అని ఆవాహనం చేసి మిగతా ఉపచారాలను చేయాలి.

## యామ పూజా

నాలుగు యామములయందు చేయు పూజా విధానం:

ప్రథమ యామమందు మూలమంత్రము ఉచ్ఛరించి మంత్రాంతమున "శ్రీ శివాయ నమ:" అనే నామంతోనే షోడశ ఉపచారము అంతాగావించాలి.

ద్వితీయ యామమందు "శ్రీ శంకరాయ నమ:" అనే నామంతో,

తృతీయ యామమందు "శ్రీ మహేశ్వరాయ నమ:" అనే నామంతో,

చతుర్థ యామమందు "శ్రీ రుద్రాయ నమ:" అనే నామములతో అన్ని ఉపచారములను ఆచరించవలెను.

ప్రతీ యామమందును తైలాభ్యంగనము, పంచామృతము, ఉష్ణోదకము, గంధోదకము, శుద్ధోదకముచే చేయవలెను. యజ్ఞోపవీతము ఇచ్చిన పైన గోరోచన, కస్తూరి, కుంకుమ, కర్పూర, అగరు, చందన మిశ్రిత అనులేపనముచే పూయవలెను. ఉమ్మెత్త, గన్నేరు, జిల్లేడు, మారేడుల చేత పూజ మిగులు ప్రశస్తము.

పూజాంతమున ప్రార్థన:

శ్లో॥ నిత్యం నైమిత్తికం కామ్యం యత్ కృతంతు మయా శివ,
తత్ సర్వం పరమేశాన మయా తుభ్యం సమర్పితం

అని అక్షతలు నీరు వదిలివేయాలి.

శ్లో॥ శివరాత్రి వ్రతం దేవా పూజా జప పరాయణ:,
కరోమి విధివద్దత్తం గృహాణార్ఘ్యం నమోస్తుతే॥
అని దోసిటితో నీటిని తీసుకొని శివుడికి చూపిస్తూ అర్ఘ్యమీయవలెను.

అనంతరము మరుసటి దినం ప్రాత: కాలమున శివపూజను గావించి పన్నెండు మంది బ్రాహ్మణులకు గాని ఒక బ్రాహ్మణుని కాని పూజింపవలెను.

శ్లో॥ యన్మయాద్య కృతం పుణ్యం తత్ రుద్రస్య నివేదితం,
త్వత్ ప్రసాదాన్ మహాదేవ వ్రతమద్య సమర్పితం"
ప్రసన్నో భవమే శ్రీమన్ సద్గతి : ప్రతిపాద్యతాం,
త్వతా లోకనమాత్రేన పవిత్రోస్మి నసంశయ:

అనగా... నే చేసిన సుకృతము నీకు సమర్పించితిని. నీ దర్శనంచే పవిత్రుడనైతిని. నా యందు ప్రసన్నుడవై నాకు సద్గతినీయుము అని ప్రార్థించి బ్రాహ్మణులకు భోజనము పెట్టి తానూ పారణ చేయవలెను.

సంసారక్లేశ దగ్ధస్య వత్రేనానేన శంకర,
ప్రసీద సుముఖోనాథ జ్ఞాన దృష్టి ప్రదో భవ

అనగా .... ఓ శంకరుడా ! ఈ వ్రతముచే ప్రసన్నుడవై సంసార క్లేశములచే దగ్ధుడనైన నాకు జ్ఞాన దృష్టిని ఇమ్మని భావము. ఇతి శివరాత్రి విధి. (శివరాత్రి వ్రతం సమర్పం)




(మం. అంటే మంత్రం, శ్లో అంటే శ్లోకం. దిగువ పూజావిధానంలో మంత్రం ఉన్న చోట మంత్రం వచ్చిన వారు మాత్రమే ఆ మంత్రాన్ని చదువుకోవాలి. మంత్రం రానివారందరూ శ్లోకాలు చెప్పుకోవాలి)

**రుద్ర విధాన శివ పూజా విధి:**

**ఓం అయం ముహూర్తస్సుముహూర్తో అస్తు ॥**

(స్వామి పై అక్షతలు వేసి నమస్కరించవలెను.)

**శ్రీ గురుభ్యోనమ: హరి: ఓం, శ్రీ మహాగణాధిపతయే నమ:, శ్రీ మహా సరస్వత్యై నమ:,**

**శ్రీ గురుభ్యోనమ: హరి: ఓం.**

**దీపారాధన**

(ఈ క్రింది శ్లోకం చదువుతూ, దీపం కుంది వద్ద అక్షతలు ఉంచి నమస్కరించాలి)

**మం॥ ఉద్దీప్యస్వ జాతవేదో -- దిశో దిశ.**

**శ్లో॥ భోదీప దేవి రూపస్త్వం, కర్మసాక్షీ అవిఘ్నకృత్ !**
**యావత్పూజాం కరిష్యామి తావత్వం సుస్థిరో భవ॥**
**మం. ఓం దేవీం వాచ = సుష్టు తైతు ॥**

**ఓం అయం ముహూర్తస్సుముహూర్తో అస్తు॥ సుముహూర్తకాలే సూర్యాదీనాం నవానాం గ్రహాణాం అత్యంత ఆనూకూల్యతా సిద్ధిరస్తు.**

**ఘంటా నాదము**

**శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసామ్.।**
**కుర్యాత్ ఘంటారావం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్ ॥**
**అపసర్పంతు యే భూతా: యే భూతా భూమి భారకా:।**
**యే భూతా విఘ్న కర్తార: తేనశ్యంతు శివాజ్ఞయా।**
**అపక్రామంతు భూతాద్యా: పిశాచాస్సర్వతో దిశాం।**
**సర్వేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥**
**తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ।**
**విద్యాబలం దైవ బలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగ్మం స్మరామి ॥**
**యత్ర యోగీశ్వర: కృష్ణో యత్ర పార్థోధనుర్ధర:॥**
**తత్రశ్రీ: విజయోభూతి: ధృవానీతిర్మతిర్మమ ॥**

స్మృతే సకల కళ్యాణ భాజనం యత్ర జాయతే।
పురుషంతమజం నిత్యం వ్రజామి శరణం హరిం॥
సర్వదా సర్వ కార్యేషు నాస్తితేషామమంగళం।
యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనం హరి:॥
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవ:।
యేషామిందీవరశ్యామో హృదయస్థో జానార్దన:॥
ఆపదామపహర్తారం దాతారం స్వర్వసంపదామ్।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్॥
సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణిక:।
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిప:॥
ధూమకేతుర్గణాధ్యక్షో: ఫాలచంద్రో గజానన:।
వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబ: స్కంద పూర్వజ:॥
షోడశైతాని నామాని య: పఠేత్ శృణుయాదపి।
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా॥
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే॥
శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥
అభీప్సితార్థ సిధ్యర్థం పూజితో యస్సురాసురై:।
సర్వవిఘ్నహరస్తస్మై గణాధిపతయే నమ:॥
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే।
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే॥



శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమ:, శ్రీ ఉమా మహేశ్వరాభ్యాం నమ:, శ్రీ వాణీ హిరణ్యగర్భాభ్యాం నమ:, శ్రీ శచీ పురందరాభ్యాం నమ:, శ్రీ అరుంధతీ వసిష్ఠాభ్యాం నమ:, శ్రీ సీతా రామాభ్యాం నమ:, మాతా పితృభ్యాం నమ:, శ్రీ సర్వేభ్యో మహాజనేభ్యో నమో నమ:

(అక్షతలు స్వామి పైన వేసి నమస్కరించాలి.)

**<u>ఆచమనం</u> :** (ఉద్దరిణతో 3 సార్లు నీళ్ళు మినపగింజంత తీసుకొని గోకర్ణ ఆకృతిలోని కుడిచేతిలో పోసుకొని శబ్దం

రాకుండా తాగాలి.)

ఓం కేశవాయ స్వాహా (అనుచు - జలపానము చేయవలెను)

ఓం నారాయణాయ స్వాహా (అనుచు - జలపానము చేయవలెను)

ఓం మాధవాయ స్వాహా (అనుచు - జలపానము చేయవలెను)

ఓం గోవిందాయ నమ: (కుడి అరచేతిలో నీళ్ళు పోసుకొని వదిలేయాలి)

ఓం విష్ణవే నమ:

ఓం మధుసూదనాయ నమ:

ఓం త్రివిక్రమాయ నమ:

ఓం వామనాయ నమ:

ఓం శ్రీధరాయ నమ:

ఓం హృషీకేశాయ నమ:

ఓం పద్మనాభాయ నమ:

ఓం దామోదరాయ నమ:

ఓం సంకర్షణాయ నమ:

ఓం వాసుదేవాయ నమ:

ఓం ప్రద్యుమ్నాయ నమ:

ఓం అనిరుద్ధాయ నమ:

ఓం పురుషోత్తమాయ నమ:

ఓం అధోక్షజాయ నమ:

ఓం నారసింహాయ నమ:

ఓం అచ్యుతాయ నమ:

ఓం జనార్ధనాయన నమ:

ఓం ఉపేంద్రాయ నమ:

ఓం హరయే నమ:

ఓం శ్రీ కృష్ణాయ నమ:



శ్లో ॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచా: ఏతే భూమి భారకా :।

ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

(అక్షతలు వాసన చూసి తల పై నుంచి వెనుక వేసుకోవాలి.)

## ప్రాణాయామం

(అనగా కుడి చేయి ఉంగరంవేలు మరియు మధ్య వేలితో ముక్కు ఎడమ రంధ్రమును మూసి, శ్వాసను ముక్కు కుడి రంధ్రం నుండి నెమ్మదిగా పీల్చుకోవాలి. ఇలా పీల్చడమును పూరకము అని అంటారు. అలా పీల్చిన గాలిని బయటకు వదలకుండా కుడి చేయి బొటనవేలితో ముక్కు కుడి రంధ్రమును కూడా మూసి ఆ శ్వాసను లోపల బంధించగలిగినంతసేపు బంధించాలి. ఇలా బంధించడమును కుంభకము అని అంటారు. ఆ తరువాత కుడి చేయి ఉంగరం వేలు మరియు మధ్య వేలిని తీసివేసి పీల్చుకున్న శ్వాసను మొత్తం ముక్కు ఎడమ రంధ్రం నుండి నెమ్మదిగా బయటకు వదలాలి. ఇలా వదలడమును రేఫకము అని అంటారు. ఈ ప్రాణాయామము చాలా శక్తి వంతమైనది. మన ఆయు:ప్రమాణం మన రెప్ప పాటులను బట్టీ, ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలను బట్టీ, మన నోటి నుండి వచ్చే వర్ణ సంఖ్యలను బట్టి నిర్ణయించబడుతుంది. ఇన్ని సార్లు గాలి పీల్చి వదలిన పిమ్మట, ఇన్నిసార్లు రెప్పలు మూసి తెరచిన పిమ్మట, ఇన్ని అక్షరాలు పలికిన పిమ్మట వీడి ఆయువు తీరును అని విధిచేత రాయబడి ఉంటుంది. మన ఆయువు తీరే నాటికి ఆ మూడూ ఒకేసారి పుర్తగును. అందుకే మన ఋషులు గాలిని పీల్చి కుంభకములో నిలిపి అనేక సంవత్సరములు రెప్పపాటు లేకుండా మౌనంగా తపస్సు చేసేవారు. ఆ తపస్సు చేసినంతకాలం వారి ఆయుష్షు నిలచి ఉండేది. ఇంతటి శక్తి ఉంది ప్రాణాయామానికి. మనము అటువంటి తపస్సు చేయకపోయినా రోజూ కొంత సమయం ప్రాణాయామ సాధన చేస్తే ఎటువంటి రోగములనైనా అదుపులో పెట్టుకుని ఆరోగ్యముతో జీవించ వచ్చును మరియు చేసే సాధన పైన ఏకాగ్రత కుదురును.)

## సంకల్పము

మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం - శ్రీ మహా విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణ: ద్వితీయ పరార్థే శ్వేతవరాహ కల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమ పాదే జంబూ ద్వీపే భరత వర్షే ప్రదేశే భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే (మీరు ఉన్న ప్రదేశాన్ని బట్టి ఇక్కడ మార్చి చెప్పకోవాలి. అమెరికాలో నివసించే వారైతే, కౌంచ ద్వీపే, రమణక వర్షే, ఐంద్రిక ఖండే, సప్త సముత్రాంతరే, కపిలారణ్యే అని చెప్పకోవాలి.) శ్రీశైలస్య వాయువ్య ప్రదేశే, క్రిష్ణా గోదావర్యో: మధ్యదేశే, (ఇది కూడా ప్రదేశాన్ని బట్టి మారుతుంది), శాలివాహనశకే, బౌద్ధావతారే, రామక్షేత్రే, శోభన గృహే, సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురు చరణ సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన స్వస్తి శ్రీ ....... సంవత్సరే .......................,( ప్రభవ విభవ మొదలగు సం॥లలో ఇప్పుడు జరుగుతున్నది ఏ సంవత్సరమైతే ఆ పేరు చెప్పకోవాలి.) ఉత్తరాయణే, శిశిర ఋతౌ, మాఘ మాసే, కృష్ణ పక్షే, చతుర్దశ్యామ్, .......వాసరే, (7 వారాలకీ సంస్కృతంలో వేరే పేర్లు ఉన్నాయి. అవి

ఆదివారం - భానువాసరే, సోమవారం - ఇందువాసరే, మంగళవారం - భౌమవాసరే, బుధవారం - సౌమ్యవాసరే, గురువారం - గురువాసరే, శుక్రవారం - భృగువాసరే, శనివారం - మంద/స్థిరవాసరే) శుభ నక్షత్రే, శుభ యోగే శుభ కరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ.

శ్రీమాన్..........గోత్ర:-......... నామధేయః - ధర్మ పత్నీ సమేతోహం-అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థైర్య ధైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్య అభివృద్ధి అర్థం, ధర్మ అర్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిధ్యర్థం, మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం,

శ్లో॥ శివరాత్రి వ్రతం హ్యే తత్ కరిష్యేహం మహాఫలం।
నిర్విఘ్నం కురుమేదేవా త్వత్ ప్రసాదాత్ జగత్పతే॥
చతుర్దష్యాం నిరాహారో భూత్వా శంభో పరేహని।
భోక్ష్యేహం భుక్తి ముక్త్యర్థం శరణం మే భవేశ్వర॥

మహా శివరాత్రి పర్వదిన కాలే మహాదేవ అనుగ్రహ ప్రాప్తి అర్థం రుద్ర సూక్త విధానేన సకృత ఆవర్తన పూర్వక / మహాన్యాస పూర్వక / ఏకాదశ రుద్ర / రుద్రాభిషేక పూజాం కరిష్యే ! అని సంకల్పించి అక్షతలు నీళ్లు పళ్లెంలో వదిలిపెట్టాలి.

(టూకీగా ఈ సంకల్పం వివరణ : కలియుగం ప్రథమ పాదంలో - భారతదేశంలో - నాకు శుభమును కలిగించు గృహములో - దేవుని ముందు ఉన్నటువంటి నేను - ఫలాన సంవత్సర-మాస-తిథి-వార-నక్షత్రములు కలిగిన ఈ శుభదినమున - గోత్రంలో పుట్టిన- పేరుతో పిలవబడే నేను------ ధర్మపత్నితో కూడుకున్న వాడనైన (ఆడవారు ఇది చెప్పుకోనవసరం లేదు) నేను, ఆ మహాదేవుని అనుగ్రహం కోరి మహా శివరాత్రి పర్వదినమున రుద్ర విధానముగా అభిషేకం చేయుచున్నాను అని అర్థం. పైన సంకల్పంలో మీరు అభిషేకం ఎలా చేసుకుందాము అనుకున్నారో అది చెప్పుకోవాలి. అనగా .. ఒక రుద్రమా ? మహాన్యాసముతోనా? ఏకాదశమా అనేది. మీ గోత్రం, మీ ఇంటిపేరుతో కలిపి మీ పేరు నక్షత్రం చెప్పుకోవాలి.)

<u>తదంగ కలశ పూజాం కరిష్యే</u>

## కలశారాధనం।

కలశం గంధ పుష్పాక్షతై: అభ్యర్చ్య॥

రాగి ఇత్తడి లేదా వెండి చెంబులో శుద్ధమైన జలమును తీసుకొని ఆ జలమును పూజించాలి. మనము ఆచమనము చేసిన పాత్రకాక, భగవంతునికి ఉపయోగించడం కొరకు వేరే ఒక కలశములో నీటిని తీసుకుని ఆ కలశమును గంధము, పసుపు, కుంకుమలతో అలంకరించాలి. కలశములో త్రిమూర్తులు, మాతృ గణములు, సప్త సాగరములు, సప్త ద్వీపములు, చతుర్వేదములు ఆవాహన అగునట్లు భావిస్తూ

**ఈ క్రింది శ్లోకము చదవాలి.** (ఈ కలశము కేవలం భగవంతుని పూజకోసం వినియోగించడానికి మాత్రమే. మన ఆచమనము కోసం మనకో పాత్ర ఎలా ఉందో, అలాగే స్వామి వారి ఆచమనమునకు, స్నానమునకు మొదలైన వాని కొరకు నీటిని ఉపయోగించుటకు ఈ కలశం.)

**కలశస్య ముఖే విష్ణు: కంఠే రుద్ర స్సమాశ్రిత:**
**మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాస్మృతా:**
**కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా**
**ఋగ్వేదోథ యజుర్వేద: సామవేదో: అథర్వణ:**
**అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితా:**
**ఆయాంతు దేవ పూజార్థం దురితక్షయ కారకా:।**
**గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి**
**నర్మదే సింధు కావేర్యా జలేస్మిన్ సన్నిధిం కురు.**
**మం. ఓం ఆకలశేషు --- వర్ధతే॥**
**మం. ఓం ఆపోవా ఇదగ్ం -- వస్సువరాప ఓం॥**



'గరుడ ముద్ర'

(అభిషేక జలానికి 'గరుడ ముద్రను' చేతితో చూపించి మృత్యుంజయ మంత్రములతో మరియు శివపంచాక్షరీ మంత్రముతో అభిమంత్రించి జలాన్ని అమృతీకరణము చేయాలి. తరువాత ఈ క్రింది శ్లోకములను చదవాలి.)

**కలశోదకేన పూజా ద్రవ్యాణి దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య. (కలశములోని నీటిని పూజా ద్రవ్యముల యందు, దేవుని యందు, తన యందు చల్లుకోవలెను.)**

**అపవిత్ర: పవిత్రోవా సర్వావస్థాంగతోపివా !**
**యస్మరేత్ పుండరీకాక్షం సబాహ్య: అభ్యంతరశ్శుచి:**
**గోవిందేతి సదా స్నానం గోవిందేతి సదా జపం।**
**గోవిందేతి సదా ధ్యానం సదా శ్రీ గోవింద కీర్తనం॥**



# కలశంలో ఏయే దేవతలు ఏయే స్థానాల్లో ఉంటారో చూపించే చిత్రం



## శంఖ పూజ

తదంగ శంఖ పూజాం కరిష్యే !

దక్షిణావర్త శంఖమును పూజించాలి

శంఖం ప్రక్షాళ్య (శంఖమును కడగాలి)

శంఖం పూరయిత్వా। (కలశం లోని నీటితో శంఖమును నింపాలి)

శంఖం గంధ పుష్ప అక్షతేన అభ్యర్చ్య। (గంధ పుష్పఅక్షతలతో పూజించాలి)

శంఖమూలే బ్రహ్మణం ఆవాహయామి.

శంఖ మధ్యే విష్ణుం ఆవాహయామి.

శంఖాగ్రే సదాశివం ఆవాహయామి.

(అంటూ 3 సార్లు అక్షితలు వేయాలి. ఆ శంఖమును ఎడమ చేతిలో పెట్టుకొని దానిపైన కుడి చేయిని పెట్టి కింది శ్లోకం చెప్పాలి.)

శంఖం చంద్రార్కదైవత్వం కుక్షౌ వారుణ దైవతం।

పృష్ఠే ప్రజాపతిశ్చంద్ర అగ్రే గంగా సరస్వతీ।

త్రైలోక్యే యాని తీర్థాని వాసుదేవస్యచాజ్ఞయా !

శంఖే తిష్ఠంతి సర్వాణి తస్మాత్ శంఖం ప్రపూజయేత్।

త్వం పురా సాగరోత్పన్న: విష్ణునా విధ్రుత: కరే।

సర్వదేవ హితార్థాయ పాంచజన్య నమోస్తుతే।

దర్శనే నాపి శంఖస్య స్పర్శనేనతు సర్వశ:।

విలయం యాంతి పాపాని హిమవత్ భాస్కరోదయే।

స్తుత్వా శంఖం కరే ధృత్వా మంత్రైరేభిస్తు వైష్ణవై:।

పాంచజన్యాయ విద్మహే, పావమానాయ ధీమహి।

తన్న: శంఖ: ప్రచోదయాత్।




శంఖోదకేన పూజా ద్రవ్యాణి, దేవం, ఆత్మానంచ సంప్రోక్ష్య।

(శంఖంలోని నిటి చేత పూజా వస్తువుల పైన, దేవుని పైన, తన పైన నీళ్ళు చల్లుకోవాలి.)

శంఖోదకం కలశేషు నిక్షిప్య, శేషం ఈశాన్య దేశే విసృజేత్, పున: శంఖం గాయిత్రీ మంత్రేణ పూరయిత్వా,

(శంఖంలోని నీటిని కలశంలో పోసి, చివరి కొంత జలాన్ని ఈశాన్య భాగంలో వదిలేసి, మళ్ళీ కలశంలోని నీటిని గాయత్రీ మంత్రం చెప్పుకుంటూ శంఖమును నింపాలి.)

తదంగ ఘంట పూజాం కరిష్యే !

## ఘంట పూజ



ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసాం
కుర్యాత్ ఘంటారావం తత్ర దేవతాహ్వాన లాంఛనం।
అపసర్పంతు యేభూతా : యేభూతా భూమి భారకా:
యే భూతా విఘ్న కర్తార : తేనష్యంతు శివజ్ఞయా।
అపక్రామంతు భూతాద్యా: పిశాచాస్సర్వతో దిశాం।
సర్వేశామవిరోధేనా బ్రహ్మకర్మ సమారభే।
(ఈ శ్లోకం చెప్పి ఘంటా నాదం చేసి ఆ ఘంట పైన గంధం అక్షింతలు వేసి నమస్కరించాలి.)

## గణపతి పూజ

తదంగ హరిద్ర గణపతి పూజాం కరిష్యే !
(అని అక్షతలు వదిలేయాలి. ముందుగా పసుపు గణపతిని సిద్ధం చేసుకొని పళ్ళెంలోని బియ్యంలో తమలపాకులపైన ఆ పసుపు గణపతిని ఉంచి పూజించాలి.)

<u>ధ్యానం :</u>

గజాననం భూత గణాది సేవితం కపిత్థ జంబూ ఫలసార భక్షితం
ఉమాసుతం శోక వినాశ కారణం నమామి విఘ్నేశ్వర పాద పంకజం!



ఓం శ్రీ గణేశాయ నమ: ధ్యానం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: ఆవాహనం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: పాద్యం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: అర్ఘ్యం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: ఆచమనం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: స్నానం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: వస్త్రం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: ఉపవీతం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: గంధం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: హరిద్ర చూర్ణం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: పుష్పం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: ధూపం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: దీపం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: ఆచమనం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: నైవేద్యం సమర్పయామి

ఓం శ్రీ గణేశాయ నమ: శుద్ధ ఆచమనం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: తాంబూలం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: దక్షిణాం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: మంగళ నీరాజనం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: మంత్రపుష్పం సమర్పయామి
ఓం శ్రీ గణేశాయ నమ: ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి
అనేన గణపతి పూజనేన పరమేశ్వర అర్పణం అస్తు.. అని అక్షతలు నీళ్ళు వదిలేయాలి.

(ఇక్కడ గణపతి పూజని సూక్ష్మంగా నామాలతో ఇవ్వడం జరిగింది. ఇలా పూజించడం తప్పు కాదు. మీ అవకాశాన్ని బట్టి చేసుకోగలరు.)

మళ్ళీ ఆచమనం చేసి కింది విశేష సంకల్పం చెప్పుకోవాలి.

## విశేష సంకల్పం

శ్రీ మాన్... గోత్ర:, .. నామధేయ:.. ధర్మపత్నీ సమేతోహం, శ్రీమత:.. గోత్రస్య...... నామధేయవత్యా:, మమ ధర్మపత్నీ సమేతస్య, అస్మాకం సహకుటుంబానాం, క్షేమ, స్థైర్య, ధైర్య, వీర్య, విజయ, అభయ, ఆయు:, ఆరోగ్య, ఐశ్వర్యాభివృధ్యర్థం, ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిధ్యర్థం, పుత్ర పౌత్రాభి వృధ్యర్థం, ఇష్ట కామ్యార్థ సిధ్యర్థం, రాజ ముఖే, రాజ ద్వారే, సర్వదా సర్వ కార్యేషు దిగ్విజయ సిధ్యర్థం, మమ చింతిత మనోరథ ఫల సిధ్యర్థం, ఆత్మ సంస్కార, గాడబద్ధ కర్మ పాశ నివృత్యర్థం, మమ కాయిక, వాచిక, మానసిక, త్రైవర్ణిక అశేష పాప నివృత్తి ద్వారా, మమ జన్మభ్యాసాత్, జన్మ ప్రభృతి ఏతత్ క్షణ పర్యంతం, మధ్య వర్తిని కాలే బాల్య, యౌవన, కౌమార, వార్ధక్య, జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థాసు, మనోవాక్కా యేంద్రియ వ్యాపారై: రహసి ప్రకాశేచ జ్ఞానతో అజ్ఞానత: ఏవం బహూనాం బహు విధానాం, సర్వేషాం పాపానాం ఉపశమనార్థం, అనేక జన్మ సహస్రేషు, ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక దు:ఖత్రయ నివృత్యర్థం, కోటి సంఖ్యానాం, మత్ కులోత్పన్నానాం, సర్వేషాం, పితౄణాం, నరక లోకోత్తర ద్వారా శివలోక నివాస సిధ్యర్థం, సకల అశుభ నివృత్యర్థం, సకల దారిద్ర్య నివృత్యర్థం, శ్రీ మహాలక్ష్మీ క్షేమ స్థైర్య సిధ్యర్థం, కైలాస లోక అనేక కాల నివాసానంతరం, శాశ్వత శివ పద అవాప్యర్థం, సకలాభీష్టప్రదాయక శ్రీ మహా త్రిపుర సుందరీ సమేత శ్రీ మహాలింగ పరమశివ దేవతా ప్రీత్యర్థం, మమగృహే రాజ్యలక్ష్మీ, జయలక్ష్మీ, ధనలక్ష్మీ, ధాన్యలక్ష్మీ, సామ్రాజ్యలక్ష్మీ, , మోక్షలక్ష్మీ, , ధైర్యలక్ష్మీ, విద్యాలక్ష్మీ సిధ్యర్థం, చతుష్షష్టి కళా విద్యా ప్రాప్త్యర్థం, భూత, ప్రేత, పిశాచ, కామినీ, మోహినీ, ఢాకిన్యాది ఉచ్చాటనార్థం, సర్వారిష్ట పరిహారార్థం, మమ శరీరే, వర్తమాన, వర్తిష్యమాణ, నిదాన హేతుభూత పాప నివృత్తి ద్వారా సమస్తామయ నిబర్హణార్థం, నిరంతరం శివలోక నివాసార్థం, శ్రీ భవానీ సమేత శ్రీ మహాలింగ పరమశివ దేవతా ప్రీత్యర్థం, అన్యోన్య సహాయేన, సద్యోజాత శ్రీ రుద్ర విధానేన, పురుష సూక్త పూర్వక, యావచ్ఛక్తి ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥

## ప్రాణ ప్రతిష్ఠ

మం॥ అసునీతే -- ముపహ్వాయతే॥

శ్లో॥ స్వామిన్ సర్వ జగన్నాథ యావత్ పూజా అవసానకం

తావత్త్వం ప్రీతి భావేన లింగేస్మిన్ సన్నిధింకురు।

శ్రీ భవాని శంకర స్వామి నే నమ: ప్రాణప్రతిష్ఠాపనం సమర్పయామి.

సాంగం సాయుధం సశక్తీ పత్నీ పుత్ర పరివార సమేతం శ్రీ భవాని శంకర స్వామి దేవతాం స్థాపయామి పూజయామి.

## ధ్యానం

కైలాసే కమనీయ రత్నఖచితే కల్పద్రుమూలే స్థితమ్

కర్పూర స్ఫటికేందు సుందర తనుం కాత్యాయినీ సేవితం

గంగా తుంగ తరంగ రంజిత జటాభారం కృపాసాగరం

కంఠాలంకృత శేషభూషణ మహా మృత్యుంజయం భావయే।

(అక్షతలు వేసి నమస్కరించవలెను. క్రింది శ్లోకం చెప్పుతూ లింగము పైన రెండు తమలపాకులు బొర్లించి పట్టుకొనవలెను)

## ఆవాహనమ్

ఓం సద్యోజాతం ప్రపద్యామి ఇతి ఆవాహనం -

ఓం నమో భగవతే రుద్రాయ ॥

మం. నమస్తే రుద్ర మన్యవ = ముత తే నమ:'

మం. ఓం సహస్ర శీర్షా = దశాంగులం !

శ్లో॥ ఆగచ్ఛ మృత్యుంజయ చంద్రమౌళే వ్యాఘ్రాజినాలంకృత శూలపాణే

స్వభక్త సంరక్షణ కామధేనో ప్రసీద సర్వేశ్వర పార్వతీశ॥

స్వాత్మ సంస్థ మజం శుద్ధం త్వా మద్య పరమేశ్వర

అరణ్యామివహవ్యానం మూర్తిమావాహయామ్యహం

శ్రీ భవాని శంకర స్వామి నే నమ:। ఆవాహనమ్ సమర్పయామి ॥

(అని అక్షతలు దేవుని పై వేసి నమస్కరించవలెను)

## ఆసనమ్

ఓం సద్యోజాతాయవై నమో నమ: ఇతి ఆసనమ్ -

మం॥ యా త ఇషు: = రుద్ర మృదయ

మం॥ ఓం పురుష = తిరోహ'తి ॥

శ్లో॥ సర్వాంతర్యామిణే దేవ సర్వబీజ మయా శుభమ్

స్వాత్మస్థాయ పరంశుద్ధమానసం కల్పయామ్యహమ్ ॥

శ్లో॥ భాస్వన్మౌక్తికతోరణై మరకతస్తంభాయుతాలంక్రుతే

సౌధే ధూప సువాసితే మణిమయే మాణిక్య దీపాంచితే

బ్రహ్మేంద్రామర యోగిపుంగవగణైరానీత కల్పద్రుమై

శ్రీ మృత్యుంజయ సుస్థిరో భవ విభో మాణిక్య సింహాసనే ॥

శ్రీ భవాని శంకర స్వామినే నమ : దివ్య రత్న ఖచిత హేమ సింహాసనం సమర్పయామి ॥

(అని అక్షతలు పూలు వేసి నమస్కరించవలెను)

## పాద్యం

ఓం భవే భవే న - ఇతి పాద్యం

మం॥ ఓం యాతే రుద్ర = చాకశీ: ॥

మం॥ ఓం ఏతావానస్య = మృతందివి॥

శ్లో॥ మందార మల్లీ కరవీర మాధవీ పున్నాగ నీలోత్పల పంకజాన్వితై : ।

కర్పూర పాటీర సువాసితైర్జలైరాధత్స్వ పాద్యముత్తమం మృత్యుంజయ ।

యద్భక్తిలేశ సంపర్కాత్ పరమానంద సంభవ:

తస్మైతే చరణాబ్జాయ పాద్యం శుద్ధాయ కల్పయే ॥

శ్రీభవాని శంకర స్వామి నే నమ: పాదయో పాద్యం సమర్పయామి ॥

(అని ఉద్ధరిణతో స్వామికి కలశంలోని నీటిని చూపించి వదలవలెను)

## అర్ఘ్యమ్

ఓం అతి భవే భవస్వమాం - ఇతి అర్ఘ్యమ్

మం॥ ఓం యామిషుం = పురుషం జగత్ ।

మం॥ త్రిపాదూర్ధ్వ = సాశనానశనే అభి ॥

శ్లో॥ సుగంధ పుష్ప ప్రకరై స్సువాసితైర్వియన్నదీశీతలవారిభి శ్శుభై :।

త్రిలోకనాథార్ధి హరార్ఘ్యమాదరాత్ గృహాణ మృత్యుంజయ సర్వవందిత ॥

తాపత్రయ హారం దివ్యం పరమానంద లక్షణం

తాపత్రయ వినుర్ముక్తం తవార్ఘ్యం కల్పయామ్యహమ్॥

శ్రీ భవాని శంకర స్వామి నే నమ: ॥ హస్తయో అర్ఘ్యం సమర్పయామి ॥

(అని ఉద్ధరిణతో స్వామికి కలశంలోని నీటిని చూపించి వదలవలెను)

## ఆచమనమ్

ఓం భవోద్భవాయ నమ: ఇతి ఆచమనీయం -

మం॥ శివేన వచసా = సుమనా అసత్

మం॥ తస్మాద్విరాడ = మధోపుర:॥

శ్లో॥ హేమాంబు వాసితై: తోయై: శీతలైరతిపావనై :

మృత్యుంజయ । మహాదేవ । శుద్ధాచమనమాచర ॥

వేదానామపి వేదాయ దేవానాం దేవతాత్మనీ ।

ఆచమనం కల్పయామీశ, శుద్దానం శుద్ది హేతువే ॥

శ్రీ భవానీ శంకర స్వామి నే నమ: ముఖే ఆచమనీయమ్ సమర్పయామి ॥

(అని భగవంతునికి మూడు సార్లు నీళ్ల చూపించి పళ్ళెంలో వదలవలెను)

## మధుపర్కం

శ్లో॥ దధిగుడ సహితం మధు ప్రకీర్ణం సుఘ్రుత సమన్వితం ధేనుదుగ్ధయుక్తమ్ ।

శుభకర మధుపర్కమాహరత్వం త్రిణయన మృత్యుంజయ । లోకవంద్య ।

శ్రీ భవాని శంకర స్వామి నే నమ: ॥ మధుపర్కం సమర్పయామి.

(అని భగవంతునికి నెయ్యి పెరుగు మరియు తేనె కలిపి చూపించి పళ్ళెంలో వదలవలెను)

అనంతరం శుద్ధాచమనీయం సమర్పయామి

## పంచామృత స్నానం

శ్లో॥ పంచాస్త్రశాస్త్ర: పంచాస్య పంచ పాతక సంహార

పంచామృత స్నానమిదం కురు మృత్యుంజయ ప్రభో ॥

శ్రీ భవాని శంకర స్వామి నే నమ: । పంచామృత స్నానం

1. ఆవు పాలు

మం॥ ఓం ఆప్యాయ - సంగధే ।

శ్లో॥ కామధేను సముద్భూతం తేజోకాంతి వివర్ధనం !

బలవీర్య సముత్పన్నం క్షీరం పుష్టికరం శుభం !!

ఇతి క్షీరేణ స్నపయామి॥

ఓం నమశ్శంభవే చ మయో భవేచ నమశ్శంకరాచయ ।

మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ ॥

గోక్షీర స్నానానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి

## 2. పెరుగు

మం॥ ఓం దధిక్రావ్ణో = షి తారిషత్ ॥

శ్లో॥ గవాక్షీర సముద్భూతం వీర్య వృద్ధిశ్చ కారణం ।
శరత్ చంద్ర నిభం శ్రేష్ఠం దధిరారోగ్య వర్ధనం
ఇతి ధధ్నాస్నపయామి ॥

ఓం నమశ్శంభవే చ మయో భవేచ నమశ్శంకరాచయ ।
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ ॥
దధి స్నానానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి

## 3. నెయ్యి

మం॥ ఓం శుక్రమసి = రశ్మిభి:

శ్లో॥ దధిగర్భ సముద్భూతం సర్వయజ్ఞ వివర్ధనం ।
అగ్ని ప్రీతికరం శ్రేష్ఠం దేవతాహారముత్తమం ॥
ఇతి గోఆజ్యేన స్నపయామి ॥

ఓం నమశ్శంభవే చ మయో భవేచ నమశ్శంకరాచయ ।
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ ॥
ఆజ్య స్నానానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి

## 4. తేనె

మం॥ ఓం మధువాతా = భవంతున: ॥

శ్లో॥ పుష్పస్వాదు రసోద్భూతం జీవానాం జీవకారణం ।
ఓషధీ సహ గామిత్ర్యా ం పృథివ్యాం అమృతం మధుం ॥
ఇది మధునా స్నపయామి ॥

ఓం నమశ్శంభవే చ మయో భవేచ నమశ్శంకరాచయ ।
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ ॥
మధుస్నానానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి

## 5. చెరుకు రసం

మం॥ ఓం స్వాదుపవస్వ - అదాభ్య: ॥

శ్లో॥ పర్వతైశ్చ సముద్భూతం సర్వలోక ప్రియావహం ।
పంచానాం అమృతం శ్రేష్ఠం శర్కరా ప్రియదర్శినీ ॥
ఇతి ఇక్షు రసేన స్నపయామి ॥

ఓం నమశ్శంభవే చ మయో భవేచ నమశ్శంకరాచయ।
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ ॥
ఇక్షు రస స్నానానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి

## కొబ్బరి నీళ్లు

మం॥ యా: ఫలినీర్యా = హస:।
ఇతి నారికేళ ఫలోదకేన స్నపయామి ॥
ఓం నమశ్శంభవే చ మయో భవేచ నమశ్శంకరాచయ।
మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ ॥
నారికేళ ఫలోదకానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి
మం॥ ఓం ఆపోహిష్ట = యదాచన:।
శుద్ధోదక స్నానం సమర్పయామి।

## గంధోదకం

మం॥ అప్సరస్సు యోగంధో = గంధస్సురభిర్జుతాం ॥
కర్పూరేలా సమాయుక్త సుగంధ ద్రవ్య సంయుతం।
గంధోదకం మయాదత్తం గృహాణ త్వం మహేశ్వర।
ఇతి గంధోదక స్నానం సమర్పయామి

## బిల్వోదకం

మం॥ మానో మహాంత = రుద్ర రీరిష

## భస్మోదకం

మం॥ మానస్తోకే తనయే = విధేమతే
విభూతిర్భూతిరైశ్వర్యం అపమృత్యుహరం శుభం
స్నానార్థంతే ప్రయచ్ఛామి గృహ్యతాం సురనాయక

## దూర్వోదకం

మం॥ కాండాత్ కాండా = శతేనచ

## రుద్రాక్షోదకం

మం॥ త్రియంబకం యజామహే = మామృతాత్

## రత్నోదకం

మం॥ సహిరత్నాని = చిత్ర మీమహే

## పుష్పోదకం

మం॥ యోపాం పుష్పం వేద = భవతి

## అక్షతోదకం

మం॥ ఆయనేతే = గృహా ఇమే

## సువర్ణోదకం

మం॥ తత్సువర్ణగ్ం హిరణ్యా = దదాతి

**<u>ద్రాక్షా రసోదకం</u>**

**మం॥ సద్యోజాతం = భవోద్భవాయ నమ :**

**<u>ఖర్జూర రసోదకం</u>**

**మం॥ వామదేవాయ నమో = మనోన్మనాయ నమ:**

**<u>కస్తూరి జలం</u>**

**మం॥ అఘోరేభ్యో = రూపేభ్య:**



**<u>జంబూఫల రసం (జామ రసం)</u>**

**మం॥ తత్పురుషాయ = ప్రచోదయాత్**

**<u>ఆమ్ర రసం (మామిడి)</u>**

**మం॥ ఈశానస్సర్వ = శివోమ్**

**<u>హరిద్రోదకం (పసుపు నీళ్ళు)</u>**

**మం॥ అదితిర్దేవా గంధర్వా = వసిష్ఠ**

**<u>మలాపకర్షణ సాన్నం</u>**

**మం॥ ఓం ఆపోహిష్ఠా = యధాచన :।**

**మలాపకర్షణ స్నానం సమర్పయామి.**

(ప్రతి ఉపచారం అనంతరం శుద్ధోదకంచే చేయాలి.)

**<u>శుద్ధోదక స్నానం</u>**

**ఓం వామదేవాయ నమ: ఇతి స్నానం -**

**మం॥ అధ్యవోచ = యాతుధాన్య:।**

**మం॥ యత్పురుషేణ= ఇద్ధ్మశ్శరద్ధవి:॥**

**జగత్రయఖ్యాత సమస్త తీర్థై: సమాహృతై: కల్మష హారిభిశ్చ।**

**స్నానం సుతోయై స్సముదాచరత్వం మృత్యుంజయానంత గుణాభిరామ।**

**శ్రీ భవాని శంకర స్వామినే నమ:॥ అభిషేక స్నానం సమర్పయామి.॥**

**అభిషేకం కుర్యాత్** (నమక - చమక పంచసూక్తములు మొదలైనవి చదువవలెను, నమక చమకములు రానివారు స్తోత్రాలలో శతరుద్రీయం, రుద్రాధ్యాయ స్తోత్రం, రుద్రస్తుతి వీనిలో ఏది చదివినా నమక చమకములు చదివిన ఫలితమే వస్తుంది)

**<u>వస్త్రమ్</u>**

**ఓం జ్యేష్ఠాయ నమ: ఇతి వస్త్రమ్**

**మం॥ ఓం అసాయస్తామ్రో = హేడ ఈమహే**

**మం॥ సప్తాస్యాసన్ = పశుమ్॥**

**శ్లో॥ నానా హేమ విచిత్రాణి చీన చీనాంబరాని చ।**

**వివిధాని చ దివ్యాని మృత్యుంజయ సుదారయ॥**

మాయా చిత్ర పటాచ్ఛన్న నిజ గుహ్యేరు తేజసే।
నిరావరణ విజ్ఞాన వస్త్రంతే కల్పయామ్యహమ్ ॥
శ్రీ భవాని శంకర స్వామినే నమ: ॥ వస్త్రయుగ్మం సమర్పయామి
వస్త్రాంతే ఆచమనీయం సమర్పయామి ॥

## యజ్ఞోపవీతమ్

ఓం శ్రేష్ఠాయ నమ: ఇతి యజ్ఞోపవీతమ్-
మం॥ అసాయోవసర్పతి = మృడయాతి న:
మం॥ తం యజ్ఞం = ఋషయశ్చయే ॥
శ్లో॥ విశుద్ధముక్తా ఫల జాల రమ్యం మనోహరం కాంచన సూత్ర యుక్తమ్ ।
యజ్ఞోపవీతమ్ పరమం పవిత్ర మాధత్స్వ మృత్యుంజయ మహాప్రభో ॥
యస్య శక్తి త్రయోణేదం సంప్రోతమఖిలం జగత్ ।
యజ్ఞ సూత్రయ తస్మైతే యజ్ఞ సూత్రం ప్రకల్పయే
శ్రీ భవాని శంకర స్వామినే నమ: ॥ యజ్ఞోపవీతమ్ సమర్పయామి ॥
యజ్ఞోపవీతాంతే ఆచమనీయం సమర్పయామి ।

## విభూతి (భస్మ విలేపనం)

మం। ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుక మివ బంధనాన్ మృత్యో: ముక్షీయ మామృతాత్ ॥
శ్రీభవాని శంకర స్వామి నే నమ: భస్మ విలేపనం సమర్పయామి ॥

## ఆభరణం

మం॥ ఓం రుద్రాయ నమ: ఇత్యాభరణాని- ప
మం॥ ఓం హిరణ్యరూపన = మస్మై
శ్రీ భవాని శంకర స్వామి నే నమ: ॥ నానావిధ ఆభరణాని సమర్పయామి ॥

## గంధమ్

ఓం కాలాయ నమ: ఇతి గంధమ్ -
మం॥ నమో అస్తు నీలగ్రీవాయ = కరన్నమ: ।
మం॥ తస్మాద్యజ్ఞాత్ = గ్రామ్యాశ్చ యే ॥
శ్లో॥ శ్రీ గంధం ఘనసార కుంకుమ యుతం కస్తూరికా పూరితం।
కాలేయేన హిమాంబునా విరచితం మందార సంవాసితమ్ ॥

దివ్యం దేవ మనోహరం మణిమయే పాత్రే సమారోపితం ।
సర్వాంగేషు విలేపయామి సతతం మృత్యుంజయ శ్రీ విభో ॥
పరమానన్ద సౌరబ్య పరిపూర్ణ దిగంతరమ్
గృహాణ పరమం గన్ధం కృపయా పరమేశ్వర ॥
శ్రీ భవాని శంకర స్వామి నే నమః ॥ శ్రీ గంధం సమర్పయామి ॥

<u>ఆభరణం (అక్షతాన్)</u>

ఓం కల వికరణాయ నమః ఇతి అక్షతాన్ -
మం॥ ప్రముంచ ధన్వ = భగవో వప
మం॥ తస్మాద్యజ్ఞాత్సర్వ = దజాయత ॥
శ్లో॥ అక్షతైః ధవళైః దివ్యైః సమ్యక్ తిల సమన్వితైః
మృత్యుంజయ మహాదేవ పూజయామి వృషధ్వజ ॥
శ్రీ భవాని శంకర స్వామి నే నమః ఆభరణార్థం శ్వేత తిల అక్షతాన్ సమర్పయామి ॥
(తెల్ల నువ్వులతో తడిపిన తెల్లటి బియ్యం కింది నామాలతో శివలింగం పైన సమర్పించవలెను)

ఓం నిధన పతయే నమః
ఓం నిధన పతాంతికాయ నమః
ఓం ఊర్ధ్వాయ నమః
ఓం ఊర్ధ్వ లింగాయ నమః
ఓం హిరణ్యాయ నమః
ఓం హిరణ్య లింగాయ నమః
ఓం సువర్ణాయ నమః
ఓం సువర్ణ లింగాయ నమః
ఓం దివ్యాయ నమః
ఓం దివ్య లింగాయ నమః
ఓం భవాయ నమః
ఓం భవ లింగాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం శర్వ లింగాయ నమః
ఓం శివాయ నమః



ఓం శివ లింగాయ నమః
ఓం జ్వలాయ నమః
ఓం జ్వల లింగాయ నమః
ఓం ఆత్మాయ నమః
ఓం ఆత్మ లింగాయ నమః
ఓం పరమాయ నమః
ఓం పరమ లింగాయ నమః
శ్రీ భవాని శంకర స్వామినే నమః।
శ్వేత అక్షతాన్ సమర్పయామి ॥

<u>హరిద్రా చూర్ణమ్</u>

మం॥ ఓం అహిరివభోగైః = పరిపాతు విశ్వతః ॥
శ్రీ భవాని శంకర స్వామినే నమః।
హరిద్రా చూర్ణమ్ సమర్పయామి ॥

<u>కుంకుమ విలేపనమ్</u>

మం॥ ఓం యాగుంగుర్యా = స్వస్తయే ॥
శ్రీ భవాని శంకర స్వామినే నమః।
కుంకుమ విలేపనం సమర్పయామి ॥

<u>సుగంధ ద్రవ్యాణి</u>

మం॥ ఓం సుమంగళీరియం = విపరేతన ॥
శ్రీ భవాని శంకర స్వామినే నమః।
సుగంధ ద్రవ్యాణి సమర్పయామి ॥

<u>బిళ్వపత్రం</u>

మం. ఓం నమో బిల్మినే చ = శ్రుత సేనాయచ ॥
త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్రియాయుధం
త్రిజన్మ పాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణం
త్రిశాఖైః బిల్వపత్రైశ్చ అచ్ఛి ద్రైః కోమలైః శుభైః
తవపూజాం కరిష్యామి ఏకబిలం శివార్పణం

కోటి కన్యా మహాదానం తిలపర్వత కోటయ:
కాఞ్చనంశైలదానేన ఏకబిల్వం శివార్పణం
కాశీక్షేత్ర నివాసం చ కాలభైరవ దర్శనం
ప్రయాగే మాధవం దృష్ట్వా ఏకబిల్వం శివార్పణం
ఇన్దువారే వ్రతం స్థిత్వా నిరాహారో మహేశ్వరా :
నక్తం హౌష్యామి దేవేశ ఏకబిల్వం శివార్పణం
రామలింగ ప్రతిష్ఠా చ వైవాహిక కృతం తధా
తటాకాదిచ సంతానం ఏకబిల్వం శివార్పణం
అఖణ్డ బిల్వపత్రం చ ఆయుతం శివపూజనం
కృతం నామ సహస్రేణ ఏకబిల్వం శివార్పణం
ఉమయా సహదేవేశ నన్ది వాహనమేవ చ
భస్మలేపన సర్వాఙ్గమ్ ఏకబిల్వం శివార్పణం
సాలగ్రామేషు విప్రాణాం తటాకం దశకూపయో:
యజ్ఞకోటి సహస్రశ్చ ఏకబిల్వం శివార్పణం
దన్తి కోటి సహస్రేషు అశ్వమేధ శతక్రతౌ
కోటికన్యా మహాదానమ్ ఏకబిల్వం శివార్పణం
బిల్వాణాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం
అఘోర పాపసంహారమ్ ఏకబిల్వం శివార్పణం
సహస్రవేద పాఠేషు బ్రహ్మాస్థాపన ముచ్యతే
అనేక వ్రత కోటీనామ్ ఏకబిల్వం శివార్పణం
అన్నదాన సహస్రేషు సహస్రోపనయనం తధా
అనేక జన్మపాపాని ఏకబిల్వం శివార్పణం
బిల్వస్తోత్రమిదం పుణ్యం య: పఠేత్ శివ సన్నిధౌ
శివలోకమవాప్నోతి ఏకబిల్వం శివార్పణం
శ్రీ భవాని శంకర స్వామినే నమ: ॥ బిల్వ పత్రాణి సమర్పయామి ॥

